# మెరుపులు

కవితోక్తులు

## పొట్లపల్లి రామారావు




రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

# MERUPULU

POETIC THOUGHTS

**By Sri Potlapalli Rama Rao**



**యువభారతి**

ప్రచురణ : 31

ప్రథమ ముద్రణ : 3,200

1 డిసెంబర్, 1974

ముఖచిత్ర రచన :

శీలా వీర్రాజు

ముద్రణ :

నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు

ముఖచిత్ర ముద్రణ :

విస్డాన్ ప్రింటర్స్, హైదరాబాదు

ప్రతులకు :

**యువభారతి**

5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500003.

లేదా

యువభారతి కార్యాలయం

ఆంధ్రసారస్వత పరిషత్తు భవనములు

తిలక్‌రోడ్, హైదరాబాదు—500001.

వెల : రూ. 2-00

---

PAPER USED FOR THE PRINTING OF THESE BOOKS
WAS MADE AVAILABLE BY THE GOVERNMENT OF INDIA
AT CONCESSIONAL RATES

YUVABHARATHI IS GRATEFUL

---



# మా మాట

ప్రాచీన, అర్వాచీన సాహిత్యాలతో దిఙ్మాత్రంగానైనా పరిచయం కలిగించాలనే ఉద్దేశంతో, సమకాలీన సమాజం ఎదుర్కొంటున్న సమస్యలను సునిశితంగా సమవేదనా దృక్కోణంతో పరిచయం కలిగించాలనే ఉద్దేశంతో యువభారతి 'సాహితీవాహిని' పరంపరను ప్రచురిస్తున్నది. ఈ సాహితీవాహిని పరంపరలో పదకొండవ తరంగంగా శ్రీ పొట్లపల్లి రామారావుగారి "మెరుపులు" ను వెలువరిస్తున్నాం. ఆయన రచన "చుక్కలు" అనే కవితా సంపుటిలోని కొన్ని చుక్కలను ఏరి 'మెరుపులు' గా యువ భారతి ప్రచురిస్తున్నది. శ్రీ రామారావు గారిది వరంగల్ సమీపానవున్న తాటికాయల గ్రామం. వృత్తి వ్యవసాయం. మనఃప్రవృత్తి సాహిత్యాధ్యయనం, సాహిత్యసృజనం. ఉర్దూభాషలో చక్కని అభినివేశం. తెలంగాణా గ్రామీణ జీవిత సమస్యలను సునిశిత బుద్ధితో పరిశీలించి సాహిత్యపరంగా వానికి రూపకల్పనచేసి 'మా వూరు' అనే పేరుతో ఒక పెద్ద గ్రంథాన్ని రచించిన మనీషి. ఆ పుస్తకం ఇంకా వెలుగులోకిరాలేదు. "ఆత్మవేదన" అనే గేయ సంపుటిని దేశోద్ధారక గ్రంథమాల పక్షాన శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామిగారు ప్రచురించారు. శ్రీ రామారావుగారు తాత్త్వికులు. ఋజు సత్ప్రవర్తనం ఆయన జీవితానికి మరొక పేరు. స్నేహపాత్రులు. కీర్తిప్రతిష్ఠల నాశించని నిరాడంబర వ్యక్తిత్వం శ్రీ రామారావుగారిది ఈ 'మెరుపుల' న్నీ ముక్తకాలుగా వెలసిన వాక్యాలు. కాచివడబోసిన జీవిత సత్యాలు

ఆలోచనలను ఉద్దీప్తం చేయగలిగే సాహిత్యాన్ని ప్రచురించాలనే ఉద్దేశ్యం యువభారతికి ఉంది. 'మెరుపులు' ప్రచురణ దానికి నిదర్శనం. ఈ అవకాశాన్ని యువభారతికి కల్గించిన శ్రీ రామరావుగారి ఔదార్యం అతి శ్లాఘాపాత్రం. ఒకనాడు యువభారతి పక్షసమావేశంలో ప్రసంగించి, కవితా గానంచేసి యువభారతి సభ్యుల హృదయాలను చూరగొని మరింత సన్నిహితులైనారు. ఆయన వ్యక్తిత్వంలో అంత మహత్తున్నది మరి. శ్రీ రామారావుగారికి యువభారతి కృతజ్ఞతాభివందనాలను సమర్పించుకొంటున్నది.

సహృదయులు యువభారతి నిర్వహిస్తున్న కార్యక్రమాలకు రూపురేఖలు దిద్దడం లోను, వాటిని విజయవంతం చేయడంలోను, యథోచితంగా తోడ్పడి తమ శక్తి యుక్తులను, ఔదార్యాన్ని, సాహిత్యాభిమానాన్ని ప్రకటిస్తారని ఆశిస్తాము.

ఇరివెంటి కృష్ణమూర్తి

1-12-1974

అధ్యక్షుడు

# ఆత్మీయం

చుక్కలను సంక్షిప్తంగా 'మెఱుపుల'నే గ్రంథ రూపంగా వెలువరిస్తామని యువభారతి వారు కోరడమేతడవు. వారికిసంతోషంతో అంగీకారం తెల్పడం జరిగింది.

చుక్కలలోని కాంతి మధువును, నేను పాకం చేసినట్టు పాఠక లోకంకూడ పానంచేసి, ఆ మాధుర్య లాభం పొందాలని నా ఆశయం.

చుక్కలు 25 ఏళ్ల పంట.

చుక్కలలో అలాటి అనుభవసారం లేకపోతే, చుక్కలు ప్రకటింపబడటానికి యింకొక 25 ఏళ్లు పట్టేవేమో. లేక అజ్ఞాతంగానైనా కళ్లు మూసేవేమో.

తన్ను తాను తీర్చి దిద్దుకోవడానికి ఆలోచన ఒక ఆయుధం. మనిషి ఎంత జడమతి ఐనా, తన్ను తాను అర్థం చేసుకోవాలనే కోరిక వానిలో బీజప్రాయంగానైనా ఉండితీరుతుంది.

అలా బీజప్రాయంగా, గుప్తంగా ఉండే, మనోవృత్తుల దోహదం చేయడానికి ఉపకరించే రచనలు ప్రజానీకంముందు పెట్టడం ఏ కాలంలోనైనా అత్యంత ప్రాధాన్యత వహిస్తుంది.

జీవిత ప్రవాహంలో కొట్టుక పోవడం ఒకటే కాదు. మనకుకావలసింది? దాని కోసరము ఏ ప్రయత్నము అక్కరలేదు.

సర్వసాధారణంగా ప్రయత్నము లేకుండానే జరుగుతున్నది అది.

జీవితం ఒడ్డున నిలవబడి ఆలోచించడం కూడా కావాలె. అయోమయంగా ఆందోళనగా ఉన్న నేటి మన జీవితాన్ని గూర్చి ఆలోచించడానికి ఎంతో సామగ్రి ఉంది చుక్కలలో. పోగా చుక్కలు శాశ్వితత్వానికి సంకేతాలు.

పెదవులు, హృదయం, ఆకలి, రుచి, శబ్దము, నిశ్శబ్దము, చీకటి, వెలుగు, మంచి, చెడు, ఈలాటి ద్వందాలు, వాటి ప్రభావాలు మనుషులపై ఉన్నన్ని రోజులు చుక్కలు కాకపోయినా, అలాటి రచనల అవసరం మనిషికి ఉండి తీరుతుంది.

దేశ కాల పరిస్థితులు అవగాహన చేసుకొని తదనుగుణ్యంగా సారస్వతోద్యమాల్ని నడప పూనుకున్న యువభారతి వారి "చుట్టూరా ఆవరించుకునివున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడంకన్న ఎంత చిన్నదీపాన్నయినా వెలిగించడం మంచిది" అనే వారిఆదర్శంతో నూటికి నూరుపాళ్ళు ఏకీభవిస్తున్నాను. వారు తమ లక్ష్యాన్ని చేరుకొనడంలో మరింత దీక్షతో కృషిచేయగలరని ఆశిస్తూ ఈ విషయాన్ని ముగిస్తున్నాను.

పొట్లపల్లి రామారావు

# మెరుపులు

వాక్కు అంతరిక్ష విహారి.
క్రియ
సంకెళ్ళువేసి విడిచిన అభాగ్యుని తడబాటు అడుగులు.

*

వాక్కు పూదోట.
క్రియ
కంటకాకీర్ణ మహాటవి.

*

వాక్కు శరీరము
అందుకే వాక్కు మీద అందరు భ్రమిస్తారు.
క్రియ ఆత్మ
అందుకే క్రియ ఎవరికంట పడదు.

*

శిశూదయంతో పాటు క్షీరోదయం అవుతుంది.

*

నదీ ప్రవాహం మోస్తురు సంపదకూడా సర్వదా
ప్రవహిస్తూ ఉండే స్వభావం కలది.
అందుకే దాని గమనాన్ని నిరోధించడానికి ప్రయత్నించే వాళ్ళను,
తన దారికి అడ్డు నిలిచే కామాంధుల
తన ప్రవాహ వేగంలో తుడిచి పెట్టుకపోతుంది.

*

చేదు మ్రింగ నేర్చినవాడె
అమృత మాధుర్యాన్ని చవిచూడ గలుగుతాడు.
భయానకాటవి మధ్య తన ప్రియ సుతుణ్ణి
అక్కున చేర్చుకొని మసలిన శకుంతల వోలె
క్రియ వాక్కును ఎప్పుడు అంతరంగానికి
దగ్గరగా ఉంచుకుంటుంది.
దీనికి విరుద్ధంగా
విపిన సీమ శకుంతలను దిగవిడిచిన మేనకవోలె
వాక్కు క్రియను దాని గతికి దానిని వదిలి
తన దారి తాను చూచుకుంటుంది.

*

మహనీయుల వాక్కే క్రియ
మందమతుల క్రియయే వాక్కు

*

మనము భుజించే ఆహారము
మన పుష్టికోసరము తుష్టి కోసరము ఐనట్లు
మన ఆలోచనలు, ఊహలు, వ్రాతలు, చేతలు,
స్వీయఅభ్యున్నతి కోసరము ఐయుండాలె.
అట్లాకాక—
లోకోద్ధరణ, లోకఖ్యాతి, ఈలాటి భ్రాంతులు ఏమైనయుంటే
మనము తప్పుదారిలో వున్నట్టు గుర్తించుకోవాలె.
ఎందుకంటె జీవితము అనే బండి నడపడానికి
ఉపయోగపడే చైతన్యము, శక్తి,
ఈ ఛిద్రాలగుండా బైటపడి మన జీవితగతిని కుంటుపడ జేస్తుంది.
ఆలోచనలు ఆకాశానికి లేవడము
జీవితము దాన్ని అందుకొనలేక పోవడము,
ప్రాణి ధర్మాలు అన్ని కలిగి,
మంచం పైనుండి కాలు కదపలేని పోలియో వ్యాధి పీడితుని మోస్తరు
జీవితము జుగుప్సగా ఉంటుంది.
ఆలోచనల శక్తిసారము
జీవితములో ఎంతప్రతిఫలిస్తే
జీవితము అంత సుఖప్రదమైనట్టు
సఫలమైనట్టు మనం గుర్తించుకోవాలె.

*

ధనము సంపాదించటము తేలిక.
కాని అది సంతుష్టిని ఇవ్వదు.
ఆత్మసాధన అసిధారా వ్రతము బోలినది.
కాని అది పూర్ణతుష్టిని ప్రసాదిస్తుంది.
సంతుష్టి ఇవ్వకపోయినా, ధన సంపాదన తేలిక కాబట్టి
మనుష్యులు తేలిక మార్గాల అనుసరించుతున్నారు.
ఆత్మవరదాయిని ఐనా, ఆత్మసాధన శ్రమతో
కూడుకున్నది కాబట్టి (ఎవరోకొందరు ధీరులు తప్ప)
ఆ సంక్లిష్ట మార్గాన్ని ఎవరూ అనుసరించుట లేదు.
అందుకే ధనముయొక్క పేరు
ముజ్జగాల మారుమ్రోగుతుంది.

*

మాతృప్రేమకు స్థావరము భూమి.
ప్రియురాలు ప్రేమకు నిలయం ఆకాశం.
ఒక దానికి పునాది ఉంటుంది.
కాని దానిపై అంతస్తులు నిర్మించడానికి
మనిషి అట్టి ప్రయత్నం చేయడు.
రెండో దానికి పునాది ఉండదు.
కాని దానిపై తారకాచుంబిత
మణిమయసౌధాలు నిర్మిస్తాడు మనిషి.

*

తల్లి నుంచి విడిపోయిన పసిపాపవలె
శబ్దము ఊరక రోదిస్తూవుంటుంది.
"ఇక్కడనే ఉన్నా, ఇక్కడనే ఉన్నా" అని
నిశ్శబ్దము ఎంత దగ్గరగా పలికినా, ఎన్నిసార్లు పలికినా
తన ఏడ్పు తాను తప్ప
తల్లియొక్క నిశ్శబ్దప్రేమ స్వనము దానికి వినిపించదు.
శబ్దము ఏడ్చి ఏడ్చి
మార్గముకానక సొమ్మసిలి ఊరకుంటుంది.
ఆ మరుక్షణము
తల్లి బిడ్డను కౌగిలిలోకి తీసుకున్నట్టు,
నిశ్శబ్దము శబ్దాన్ని

తన అదృశ్య బాహు బంధములోనికి తీసుకొని
విస్మయానందాలతో కరగించి వేస్తుంది.

*

నిశ్శబ్దము యొక్క స్తన్యముగ్రోలి పెరిగిన శబ్దము
ఓజస్సు, తేజస్సుతో కూడుకొని యుంటుంది.
తన శబ్దముతో తానే ఫీడ్ ఐన శబ్దము,
బొటనవ్రేలు నోట కరచుకొని పెరిగిన నిర్భాగ్య శిశువుబోలె
నిర్జీవంగా నిస్తేజంగా శుష్కంగా ఉంటుంది.

*

నిశ్శబ్దము ప్రాణము - శబ్దము మృత్యువు.

*

పెద్దవాళ్ళు పిల్లలను తమ మోస్తరు మర్యాదగా వర్తించాలని
అనవరతము ఒత్తిడి చేస్తుంటారు.
దీనికి వ్యతిరేకంగా పిల్లలు పెద్దలను
తమతో గంతులు వేయాలని కలిసి ఆడుకోవాలని
ఉబలాట పడుతుంటారు.

*

గారడి వాని గారడి
ముప్పాతిక మూడు పాళ్ళు డోలుతో నడుస్తుంది.
అట్లాగే-లౌకికుని ఎత్తులు
ముప్పాతిక మూడు వీసాలు మాటలతో నడుస్తాయి.
డోలు విడిచి గారడీ చేయమనండి.
గుడ్లు తేల వేస్తాడు గారడివాడు.
అట్లాగే-నోరు మూసుకొని క్రియ చేయమనండి.
గుటకలు మ్రింగుతాడు.

*

ఒంటి నిండా ధూళితో వచ్చిన పసివాడిని గడపలోనే అడ్డుకొని,
బ్రతిమిలాడి స్నానం చేయించి తల్లి యింటిలోనికి పంపినట్లు
రచ్చల వెంట తిరిగి, వ్యామోహాసక్తులతో కలుషితమై వచ్చిన శబ్దాన్ని,

నిశ్శబ్దము, ఆపాదమస్తకం, తన చైతన్య ధారతో కడిగి,
నూతన జన్మయిచ్చి హృదయాంగణంలోకి పంపుతుంది.

*

శబ్దము సంకుచితము.
నిశ్శబ్దానికి అవధులు లేవు.

*

శబ్దము మహిమాన్వితమైనది.
అది ప్రకటించలేని భావమంటూ ఉండదు.
కాని ఒకొొకసారి శబ్దము కూడా కాళ్ళు చాచి కూర్చోవలసి వస్తుంది.
అలాటి విషమ ఘట్టాలలో మనకు
నిశ్శబ్దమే శరణ్యమౌతుంది.
మన గాఢ సంతాపాన్ని ఏరూపంగా కాని వ్యక్తం చేయలేనప్పుడు...
మనం ఎంత యధార్థం చెప్పినా ఎదటివాళ్లు నమ్మరని తోచినప్పుడు...

*

లోతు ఐన దేనినీ మాటలు వ్యక్తీకరించలేవు
మాటలు కేవలం ఉపరితలానికి చెందినవి.

*

నీలో గుణ విశిష్టమేదైనా ఉంటే,
దానిని ప్రకటించడానికి తహతహలాడడము కన్న
దాని మేలిమిని పరీక్షించడములో నిమగ్నుడవు కా.
ఎందుకంటే-ఎప్పుడో ఒకప్పుడు
నీలోపలి నిక్షేపం ప్రపంచ దృష్టిలోకి రావచ్చు.
దానితో నీ దృష్టి బాహ్యోన్ముఖమై
నీలోపలి సరకు విలువ తగ్గిపోతుంది.
ఇక బాహ్యప్రలోభాలకు బానిస అయిన నీవు
కేవలము నకలు సరకులమ్ముకునే బేహారిగా
నిలిచి పోవడం కన్న మార్గాంతరం ఉండదు.

*

ప్రభుత్వం తన కర్తవ్య నిష్ఠను
తనలో ఎంత ప్రకాశింప జేసుకో గలిగితే
పరిపాలన అంత సుగమంగా నడస్తుంది.
ఎక్కడో ఆకసాన ఉండే సూర్యతేజం
లోకాల నడప గలుగుతూ ఉండడం మన మెరిగిన విషయం

*

క్రియాశూరుని వాక్కు
ఒడుదుడుకులు లేకుండా ఎంతో భారంగా ఉంటుంది.
క్రియాహీనుని వాక్కు
ఖాళీ డబ్బాలో రాళ్ల ప్రమోగించినట్టు
ఏ ప్రతిస్పందన లేకుండా శూన్యంలో కలిసిపోతుంది.

*

బయటి చీకటికన్నా లో చీకటి భయానకం
బయటి వెలుగుకన్నా లో వెలుగు ఆనందదాయకం.

*

స్వామీ ! నీ నుండి లభించే ప్రతి స్వల్ప పదార్థము
ఎంతో సరళంగా, స్వచ్ఛంగా, ఎంతో సమగ్రంగా ఉంటుంది.
అదేమి ఖర్మో కాని మనిషిని సోకగానె అది వికృతమై పోతుంది.
నీరు మలినమై పోతుంది.
భూమి వికృత మౌతుంది.
గాలి దుర్గంధ పూరిత మౌతుంది
కాంతి క్షీణమైపోతుంది.
సర్వము లోప భూయిష్ఠమై పోతుంది.
కాని, అదే పద్మపత్రములోని నీటి బిందువును చూడు
ఆకాశము నుండి ఎంత స్వచ్ఛంగా భూమికి జారిందో,
ఆ నైజ నిర్మలత్వము ఏ కాస్తకూడ కోల్పోలేదు.
మంచి ముత్యములా మిలమిలలాడుతుంది అది.
ఏమిటి దానిలో విశేషం ?
దానిలో విశేషమేమి లేదు !
ఆ పద్మపత్రము వంక చూడు
అది ఆ వర్ష బిందువును ఎట్లా స్వీకరించింది ?

అంజలి ఘటించి మహా ప్రసాదమన్నట్టు స్వీకరించింది.
మనిషి అట్లాకాక భూమి లాగుకుంటాడు - గాలి లాగుకుంటాడు.
నీటికి అడ్డు కడతాడు - తనకందిన ప్రతి వస్తువును లాగుకుంటాడు.
ప్రతి దానిలో వాడి అత్యాశ ప్రతిఫలిస్తుంది.
అత్యాశకు పాల్పడక, ఆకాశము నుంచి లభించే ప్రతివస్తువును
అంజలి ఘటించి స్వీకరించడము నేర్చుకో
నీకు లభించే వస్తువులే కాక నీ జీవితము కూడా
వినిర్మలమే కాక వినూత్న శోభతో అలరారుతుంది.

*



మనిషి జీవికకు కావలసింది అత్యల్పం కాని ఆశ అనంతం.
మనిషి అవసరము- ఆశ మధ్య అవధి ఏర్పరచడానికి
ఎప్పటి కప్పుడు ప్రయత్నము చేస్తున్నాడు.
కాని ఆశ మనిషి ప్రయత్నాల, నీటి మీది రాతలవోలె
ఎప్పటి కప్పుడు చెరిపివేస్తూ ఉంది.
అందుకే, ఆశ ఏదో, అవసరము ఏదో తేల్చుకోలేక
జీవితములో మనిషి ఒడుదొడుకులకు గురి ఔతున్నాడు.

*



గాయకులు గానామృతాన్ని
కవులు కావ్య సుధను
తాత్వికులు తత్వచింతనను



శాస్త్రజ్ఞులు తమ వినూత్న ఆవిష్కరణల
శ్రమ జీవులు వస్తుసంపదల ఎవరి తపస్సువారు
నీ పాదాల ముందు సమర్పిస్తున్నారు.
సమర్పణలో ఆనందముంది-కైవల్యము, మోక్షం, సర్వము అదే.
కాని నేను ఈ నాటక మంతా శూన్యహృదయముతో నిలబడిచూస్తున్నాను.
నా చేతిలో ఉన్నది నీ పాదాలమ్రోల అర్పణ చేయడానికి అర్హమైంది కాదు.
రక్కసిముళ్లు, పల్లేరు కాయలు, విషకంటకాలు,
నా సర్వ శక్తులు ధారవోసి సంపాదించినది,
నా సొత్తు అని చెప్పుకోతగ్గది (కామ, క్రోధాలు; అహంకార మమకారాలు) యివే
నీ పాదాల అర్పణ జేసిన విషకంటకాలు కూడా
సుకుమార, సుందర, పుష్పాలుగా మారుతాయని
అంటారు కాని తండ్రీ !

స్వార్థము కోసరం నీ పాదాల కంటకాలు అర్పించే
అధోగతికి యింకా నేను దిగజారలేదు.
నేను పెంచి పెద్ద చేసిన విషకంటకాలు
నా హృదయానికి గ్రుచ్చుకొని బాధతో ఆక్రందించనీ
ఆ కన్నీరులో ఆ బాధలో సకల కాలుష్యాలు కొట్టుక పోతాయి.

*

అనుక్షణం నీనుంచి ఎన్నోవరాలు పొందుతున్నాను.
కాని నీ నుంచి వచ్చే ఏ ఒక్కదాని మీదకూడా నీపేరు లేదు.
కాని అవే వస్తువులు నా చేత పడడంతోనే
వాటిపైన నా పేరు చెక్కి, బజారులో పెట్టి
పెద్ద సందడితో అమ్ముతున్నాను.

*

ఈ ఇల్లు ఖాళీచేయ తలిచాను.
ఈ ఇల్లు ఖాళీ చేయడానికి నాకేమి ఇష్టములేదు.
కాని ఏమిచేయను ? ఇంటిచుట్టు బాకీలు.
వానకు బాకి ! ఎండకు బాకి ! భూమికి బాకి !
ఆకాశానికి బాకి ! మనుషులకు భాకి ! పశువులకు బాకి !
సకల ప్రాణికోటికి ! ఋణభారం బాగా పెరిగిపోయింది.
ఎక్కడ పుడితె అక్కడ తీసుకురావడము తప్ప.
తిరిగి దమ్మిడి తీర్చినపాపాన పోలేదు.
బాకీలమూలాన నా పరువు ప్రతిష్ట మంట కలసి పోయేట్టు ఉంది.
కాని నేను యిల్లు ఖాళీచేస్తున్నానని తెలిసి
బాకీదారులు యిల్లు చుట్టివేయరుకదా !
అమ్మో ! మరోప్రాణికి తెలవకూడదు ఈ రహస్యం !
ఏ అర్థరాత్రి ఎప్పుడో నిశ్శబ్దంగా నిర్గమించాలె.
బయటివాళ్ల కన్ను కప్పవచ్చు కాని
నిన్ను తండ్రీ !
నీ యింటి భాగంలో అద్దెకు ఉంది,
నీ కన్నుకప్పి పోవడం ఎట్లా సంభవం ?
మా కదలిక కనిపెట్టి నీవు అద్దెకోసరం
గడపముందు నిలబడితె ఏమి జవాబు చెప్పను ?

ఇంటిలోని విలువైన వస్తువులన్నీ
ఇదివరకె తాకట్టుపడి పోయినాయి.
ఇక మిగిలి ఉన్నదేమిటి ?
ఇదిగో ! ఒకే ఒక చిన్న నాణెము
ఈ చిరుగుచొక్కా మూలపడి ఉంది.
ఇది నీ చేతిలో పెడితె దానిని అటుయిటు తిరగవేసి
మళ్లీ నా ముందు విసరివేయవుకదా !
ఎందుకంటే చాలాసార్లు బజారుకు పోయి
చిన్నముఖంతో తిరిగి వచ్చింది ఇది.
కాని నా ఆస్తి అని చెప్పుకోతగ్గది.
నా సంపాదనలో శేషించింది ఈ ఒక నాణెమే.
కృతజ్ఞత ! అనే ఈ నాణాన్ని
నీ పాదాలముందు ఉంచుతాను తండ్రీ ! స్వీకరించు

*

ఒకసారి నీరు రాయిని ప్రశ్నించింది
"నీవు కదల వెందుకు ?"
రాయి జవాబుగా అంది
"నీవు నిలబడ వెందుకు ?"
"ఎవరైనా గట్టువేస్తే నిలబడతాను" నీరు అంది.
"ఎవరైనా ఉలితో కదిపితే లేస్తాను"
రాయి జవాబుగా అంది.

*

కొలిమిలో కాచి తయారు చేసేటప్పుడు
తనవాడిని గూర్చి గర్వపడ్డది బాకు
కాని బంగారునీట దాని నిలువున బొమ్మలు చిత్రించేవరకు
చిన్నపోయింది అది.

*

పూర్వము స్వర్గనరకాలు మనిషికి అందకుండా
ఎక్కడో ఆకాశాన ఉండేవి
కాని దీని మూలాన కాలవ్యయం, శక్తివ్యయం
కాదొడగింది మనిషికి.
చాలాకాలానికి దేవుడు ఈ పద్ధతి ఏమి బాగాలేదని
వాటిని అక్కడనుంచి ఎత్తివేసి
మనిషి మనసులోనే ఏర్పాటు చేశాడు

అందుబాటులో ఉండే విధంగా—
కాని పాత అలవాటు మూలాన ఇప్పటికి
మనిషి ఆకాశం వంక చూస్తున్నాడు.

*

ఒకసారి బొగ్గు "నీ మహత్కాంతి రహస్యమేమిట"ని
రత్నాన్ని ప్రశ్నించింది.
రత్నం క్లుప్తంగా జవాబు యిచ్చింది.
"అజ్ఞాత తపస్సు"
"తపస్సు మూలంగా రత్నంగా మారితే మారవచ్చు
కాని లోకం కంటపడతావని ఏమి నమ్మకం?"
"అజ్ఞాత తపస్సు" మళ్లీ అదే జవాబు వచ్చింది.
"తపస్సుమూలంగా లోకం కంటపడితే పడవచ్చు.
కాని లోకం విలువ గుర్తిస్తుందని ఏమి నమ్మకం"
"అజ్ఞాత తపస్సు" మళ్లీ అదే జవాబు వచ్చింది
ముమ్మారు ఒకేమాట నొక్కిచెప్పడం చూచి
దాని వివరణ ఏమిటని బొగ్గు ప్రశ్నించింది.
"ఏమిటా! నీవు బొగ్గుగా ఉన్నంతవరకు
భూమిలో ఉన్నా పైన ఉన్నా నీ స్థితి ఒకటె.
నీవు రత్నంగా మారినవెనుక
నీ కీ తాపత్రయమే ఉండదు."

*

ఒకసారి గొడ్రాలుకు దేవుడు ప్రత్యక్షమై
"నీకు సంతానం కలిగే యోగం లేదు.
దానికిబదులు స్వర్గాన్ని కోరుకో" అన్నాడు.
"నాకు బిడ్డలేకావాలి" అంది గొడ్రాలు.
అనిమిషత్వ మిస్తానన్నాడు
నాకు బిడ్డలే కావాలంది గొడ్రాలు
అమృతాన్ని యిస్తానన్నాడు
నాకు బిడ్డలే కావాలంది గొడ్రాలు
"బిడ్డడిమీద యింత మమత ఎందుకు నీకు!"
నీవు మహాయిస్తే స్వర్గమో, అమృతమో, అనిమిషత్వమో
దీనిలో ఏదో ఒకటి యిస్తావు

సంతానంలో ఈ మూడూ ఉన్నాయి."
"మూడు ఉన్నాయా ?"
"కళ్లలో స్వర్గము-చిరునవ్వులో అమృతము
కౌగిలిలో అనిమిషత్వము."

*

తూర్పుదిశ ఎఱ్ఱబారితే
పడమర దిశ ఆ ఆభ కనిపించడం దేనికి ?
ఓ రసజ్ఞుడు కవిని ప్రశ్నించాడు.
దానికి కవి ఈ విధంగా జవాబు యిచ్చాడు.
"తూర్పు పడమరలు రెండు దిశాంగన నిద్దపుచెక్కిళ్లు
ఉదయిస్తూ ఓ చెక్కిలి, అస్తమిస్తూ ఓ చెక్కిలి
ముద్దుకొంటు ఉంటాడు సూర్యుడు.
ఒక చెక్కిలి ముద్దుగొన్నప్పుడు
రెండో చెక్కిలి కెంపెక్కడం అతిసహజం".

*

మాతృప్రేమ నిర్మల సరస్సును పోలినది.
ప్రేయసి ప్రణయం చంచల నిర్ఝరము వంటిది.
ఒక దానిలో మన ప్రతిబింబము స్పష్టంగా కనబడుతుంది
రెండోదానిలో మన ఆకృతి గోచరము కావటము కాదు
మనమే పూర్తిగా కొట్టుకపోతాము.

*

తనలోపాలు గ్రుచ్చుకొని బాధించినా కొద్ది
తన గుణాలు ప్రాతరౌన్మిషిత అంబుజాల మోస్తరు వికసిస్తాయి.

*

వెలుగు మనిషికి తన నిత్యవ్యవహారాలు
కొనసాగించుకోవడానికి సాయపడుతూనే
దానికితోడు తోడు బహిర్ముఖుణ్ణి చేస్తుంది.
రాత్రి మనిషిని ఇంటి నాలుగుగోడలనుండి
కదలకుండా చేస్తూనే అంతర్ముఖుణ్ణి చేస్తుంది.
వెలుగులో క్షితిజరేఖలంట మిట్టలు, పల్లాలు, గుట్టలు, చెట్లు

దేనికది స్పష్టంగా కనబడతాయి కాబట్టి
మనిషి దృశ్యవస్తువుల వ్యామోహంలో చిక్కి బహిర్ముఖుడౌతాడు.
రాత్రివేళ యివన్నీ చీకటిలో మునిగిపోతాయి
కాబట్టి మనసుకు నిలకడ చిక్కి అంతర్ముఖమౌతుంది.

*

ఇతరుల మరణం మనిషిలో భయమేఘాల సృష్టిస్తుంది.
కాని తనకు మరణం ఆసన్నమైనదని
అన్ని విధాల నిశ్చయమైనపుడు ప్రాతఃకాల ఉదయమండలం వోలె
ముఖమండలం భయ నిర్ముక్త మౌతుంది.

*

ముల్లును ముల్లుగా చూడవలసిందే కాని
దానిని నిరసింప కూడదు.
దానిని మనము మూర్ధాభిషిక్తము చేయని మాట నిజమే కాని,
పెరటికంచెగానైనా ఉపయోగించవచ్చు.

*

పతనానికి దారి తడవుకో అక్కరలేకుండా
ఎప్పుడు సిద్ధంగా ఉంటుంది.
అభ్యున్నతి మార్గం వెతుక్కోవలసి ఉంటుంది.
అంతేకాదు
తనకుతాను నిర్మించుకోవలసి ఉంటుంది.
కిందికి జారడం తేలిక ;
పైకి పోవడం శ్రమతో కూడిన కార్యం.

*

ప్రతిమనిషికి డబ్బు అవసరమే
కాని కొందరు డబ్బు కాళ్లదగ్గర తోక ఆడిస్తూ
దాని కటాక్షవీక్షణాలే సర్వమన్నట్టు ఉంటారు.
కొందరి కాళ్లదగ్గర అది కుక్కవోలె పడిఉంటుంది.

*

శరీరంలో హెచ్చుతగ్గులుండొచ్చు
కానీ, చైతన్యములో ఉండవు.
శారీరకంగా ఒకమనిషికి ఒక మనిషికి లొంగితె లొంగవచ్చు
కాని చైతన్యములో లొంగుపాటు తత్వము లేదు.
ఎందుకంటే
చైతన్యం అవిభాజ్యం.

*

మృత్యువు పిరికిపందల హృదయంలో డోళ్లు మ్రోగిస్తుంది
సాహసోపేతుల హృదయసౌధము ముందు
నాగస్వరము ఊదుతుంది.

*

బయటి ప్రదేశమునుంచి సొరంగం ప్రవేశించగానే రైలులో దీపాలు వెలిగినట్టు
జీవితప్రదేశమునుంచి మృత్యుభాగం చేరగానే
ఆత్మ తన వెలుగుతో తానే దీపమై
తనకు తానే మార్గదర్శకమౌతుంది.

*

కేవలం స్వంతబలంతో శత్రువుమీద విజయం సాధించడం దుస్సాధ్యం.
శత్రువు ఛిద్రాలు మనకు విజయద్వారాలు కావడానికి ఉపయోగించుకోవలె.
శత్రువు బలహీనతలు మనకు బలాన్ని కూర్చుతాయి.

*

ఎవరితోనైనా వైరము వాంఛనీయముకాదు.
ఒకవేళ అది తప్పనిసరి అయితే శత్రువుతో నిర్దాక్షిణ్యంగా తలపడు
కళ్లువిరగకుండా, పాముచావకుండా,
పద్ధతి ఎప్పుడు ప్రమాదకరమైంది. అవాంఛనీయమైంది.

*

రుచితో పొట్ట నిండకున్నా ఆకలికన్న రుచికి కోపం ఎక్కువ.
రొట్టె, గ్లాసు నీరుతో ఆకలిని తృప్తి చేయవచ్చు.
కాని తనను అట్లా తేలిక చేయడం రుచి ఒప్పుకోదు.
ఎన్నోవస్తువులు చేతికిచ్చి, ఎంతో బుజ్జగించితే కాని
ప్రసన్నము కాదు రుచి.

*

రుచి పూవురేకు వోలె కోమలంగా ఆరంభమై
కంటక రూపంగా పరిణమిస్తుంది.
శరీరములో గ్రుచ్చుకున్న ముల్లును తొలగించుకోవచ్చు
కాని రుచి అనే కంటకం శరీరముతోనే బూడిద అవుతుంది.

*

నీ దుఃఖాన్ని భగవంతుడికి కూడా తెలవనివ్వకు
దుఃఖం వెళ్లబోసుకొని
సానుభూతికోసరం చూచేవాళ్లు తేలిక అయిపోతారు-
భగవంతుని దృష్టిలోకూడా,
తేలికఅయిపోవడము-చావు రెండూ సమానం.
ఇక మనుషులకా ?
ప్రతివాడికి ఎవని ఏడ్పు వానికి ఉంది.
ప్రతివాడు తన ఏడ్పు లోకము ముందు పెట్టి
సానుభూతి సంపాదించాలని ఎదిరిచూస్తు ఉంటాడు.
అలాంటప్పుడు నీ ఏడ్పు ఎవరిముందు పెట్టపోయినా
దానికి ప్రతిఫలంగా వాడిసొద నీముందు పెడతాడు.
నీ ఏడ్పు వానికి అర్థంకాదు.
వాడిసొద నీకు బోధపడదు.
ఇక ఒకరిమీద ఒకరు తిరస్కారభావంతో లేచిపోవలసివస్తుంది.
సొదను అమ్ముకొని సానుభూతి సంపాదించాలనే వ్యాపారం చాల చెడ్డది.

*

ఈ మట్టిదివ్వె వెలగడానికి ఏ కొద్ది చమురైనా సరిపోతుంచి.
అది నీ అనుగ్రహంతో ఏదోవిధంగా లభిస్తూనే ఉంటుంది.
కాని దురదృష్టం ఏమి చెప్పను !
ఈ నగ్నసత్యం తెలిసికోలేక,
ఈ తిండికోసరం, అస్తమానం ఉరుకులు ! పరువులు !
ఈ ప్రచండోద్ధతికి ఈ బలహీన ప్రాణశిఖ తట్టుకోలేక,
అనవరతం అటు ఇటు సోలుతు ఉంటుంది.
ఇప్పుడో ఈ నిమిషమో ఆరిపోతుందేమో అన్నట్టు దిగులు కల్పిస్తుంది.
ప్రాణి లక్షణం విశ్వాసం ! వెలుగు !
కాని దిగులు పుట్టించే విధంగా అటు యిటు సోలే

ఈ బలహీన ప్రాణశిఖ ఎవరికి వెలుగు చూప గలుగుతుంది ?
ఎట్లా విశ్వాసాన్ని పురికొల్ప గలుగుతుంది ?
ఎవరికీ వెలుగు చూపవలసిన పనిలేదు.
తనకు తాను !
తన వెలుగు ముందు తాను మోకరిల్లడమే జీవితములో గొప్ప అదృష్టము.
అది సంభవము కానినాడు,
జీవితమంతా ఓ విషాద, విఫల, నిరుపయోగ, నీరస,
నిశ్చేష్ట నాటకముగా భావించక తప్పదు.

*

అధికారం, ధనం, కీర్తి, చాల సమ్మోహకరమైనవి.
వీటి ప్రభావమునుండి బయటపడటం చాల కష్టం.
ప్రపంచమంతా వీటి ప్రభావంతో నిండి ఉంది.
కాని యింతకన్న బలమైన శక్తి ఒకటి ఉంది ప్రపంచంలో.
అది సత్యం.
అది వెలిగినచోట, అధికారం, ధనం, కీర్తి
ఇవన్ని క్రీనీడలమోస్తరు పక్కలకు తొలగుతాయి.

*

సత్యము తెలుసుకోవడం చాల కష్టం.
ఎందుకంటె అబద్ధము మోస్తరు సత్యము పైపైన పడిరాదు.
పోగా ఆ సత్యము ఎంత సమ్మోహనకరం, శక్తిమంతం అయింది అంటే,
అది ఏదో విషయంలో మనిషి మనసును engage చేసి ఉంచుతుంది.
తన వద్దకి రావడానికి గల సకల అవరోధాలు తొలగించుకొని
విశుద్ధ హృదయం, వినమ్రభావంతో ఏతెంచిన వారికి
ప్రసన్న హృదయంతో సాక్షాత్కరిస్తుంది.
అబద్ధం తేలిక అయింది.
అందుకే దానిని అందరు అనుసరిస్తారు.
కాని తేలిక అయిన దానిని అనుసరించటం మూలాన
మనుషులు తేలికగానే ఉండిపోతారు.
సత్యం భారమైంది.
అందుకే దాని బరువుమోయడానికి ఎవరూ ముందుకురారు.
కదాచిత్తు నూటికి కోటికెవడో

భారము మోయడములో కృతకృత్యుడు కావచ్చు
కాని వాళ్ళు బరువైన మనుషులుగానే చలామణి అవుతారు.

*

నేను సర్వజ్ఞుడ ననుకునే వాడి జ్ఞానం
గాఢ తిమిరంలో అంతమవుతుంది.
నాకేమీ తెలియదు అనుకునే వాడి అజ్ఞానం
విశ్వకాంతిలో సంగమిస్తుంది.

*

నా జీవన సహచరీ !
ఈ సృష్టి ఏనాడు ఏర్పడ్డదో,
ఆనాడే నీవు, నేను ఈ భూమిపై జన్మించాము.
ఈ అనంత కాలప్రవాహంలో సంయోగ వియోగాలకు గురియౌతూ,
కాల ప్రవాహంలో మునుగుతూ తేలుతూ,
కాల ప్రవాహంతో పాటు పయనిస్తున్నాము.
స్త్రీ ధర్మము నిర్వహిస్తూ ఉన్నా నీవు స్త్రీవి కావు.
పురుష ధర్మము నిర్వహిస్తూ ఉన్న నేను పురుషుడను కాను.
సృష్టియొక్క నాటక రంగంలో నీవు ఒక పాత్రవు నేను ఒక పాత్రను,
కాని వచ్చిన చిక్కు ఏమిటంటే,
స్త్రీ పాత్ర నిర్వహించడానికి బదులు స్త్రీ ననుకుంటున్నావు నీవు.
పురుష పాత్ర నిర్వహించడానికి బదులు పురుషుణ్ణి అనుకుంటున్నాను నేను.
దానితో జీవన నాటకం రక్తి కట్టక
జన్మపరంపర అనే రిహార్సిల్సులో తగుల్కొనవల్సి వస్తుంది.
(ఆడిన ఆట ఆడటంలో, పాడిన పాట పాడటంలో
ఏమి ఆనందముంది)
నీవు స్త్రీవని అనుకోకుండా స్త్రీగా నటించు
నేను పురుషుడనని అనుకోకుండా పురుషుడిగా నటిస్తాను.
అట్టడగు స్వభావము నుండి మనము ఎంతపైకి లేస్తే
అంత ఉన్నతుల మౌతాము.
అప్పుడే మన నిజరూపం మనకు గోచరిస్తుంది.
అది ఒకటే ముక్తిమార్గం.

*

మనిషికి పొట్ట ఉంది.
దానికి ఆహారం అవసరం.
కాని దానిని బ్రహ్మరాక్షసి చేసికూర్చున్నాం.
బ్రహ్మరాక్షసి స్వభావమేమిటంటే,
ఎన్నిసార్లు పెట్టినా, ఎన్ని విధాలుగా పెట్టినా,
తే, తే, అంటూ ఉంటుంది. సందేహం లేదు.
తినడం కూడా ఒక విధమైన ఆనందమే
కాని—
ఇది ఎంత మితిమీరితే అంత బండబారి పోతుంది మనసు
బండబారి పోవడం చావడం రెండూ సమానం.
ఎదుటి వాళ్ళ ఆకలిని గ్రహించి
తన కబళములోని కొంత భాగాన్ని
అర్పించడములో కలిగే ఆనందాన్ని చవిచూచిన వారు
ఈ కుక్షింభరత్వాన్ని జుగుప్సతో చూస్తారు.

*

అణువు మొదలు బ్రహ్మాండం వరకు
ఈ సృష్టి అంతా ఓ క్రమ మార్గంలో నడుస్తుంది.
ఈ అనంత సృష్టిలో మనము ఒక భాగం.
ఈ సృష్టిని పాలించే శక్తులే మనలను నడుపుతున్నాయి.
మనము లోతుకు దిగి యిదంతా ఆకళింపు చేసుకోవాలె.
కాని యిదంతా ఏమీ తెలియదు మనకు
అసలు ఏమీ తెలియదు మనకు.
మనము యింటా బయటా, చేసే గంద్రగోళమంతా
కేవలం పొట్టనింపుకోవడానికి పడే తాపత్రయం
మన చదువులు, శాస్త్రాలు పొట్టవరకే పరిమితమై ఉన్నాయి.
పొట్ట నింపుకోవడమనేది ప్రాణియొక్క సాధారణ లక్షణం.
దీనితో మనిషి తృప్తిపడిన నాడు
జంతువుకు, మనిషికీ అట్టేతేడా ఉండదు.

*

వృక్షాలకు పుష్పించడం ఎంత సహజమో
మనిషికి ఆలోచించడం అంత సహజం.

పుష్పించడము ఆగిపోతే, ఫలించడము ఆగిపోయినట్టు
ఆలోచించడం ఆగిపోతే, ఆచరణ ఆగిపోతుంది.
ఆచరణకోసరం మనము పెద్ద బెంగపెట్టుకోవలసిన పనిలేదు.
పువ్వు వెనక పిందెలు వచ్చినట్టు
ఆలోచన వెనుక ఆచరణ రాక తప్పదు

*

అసలు వ్యవహారము సృష్టికర్తది.
నిర్విఘ్నంగా, నిరపాయంగా జరిగే సృష్టిక్రమంలో
మన అహంభావం, అజ్ఞానం కొద్దీ వ్రేలుపెట్టి
చేతులకు గాయాలు చేసుకొని విధిని దూరుతుంటాము.

*

మనిషి తన అల్పత్వ రక్షణకై
సర్వశక్తుల వినియోగిస్తూ ఉన్నాడు.
తుదకు అల్పత్వ రక్షణ వలన మిగిలేది అల్పత్వమే.

*

మట్టిప్రమిదకు కాక
ప్రమిదలోని జ్యోతికి కేలుమోడ్చినట్లు
భౌతికకాయానికి కాక,
భౌతికకాయములో వెలుగుతూ,
చూపులద్వారా, మాటలద్వారా
నడకలద్వారా, నవ్వులద్వారా
శరీరములోని అంగప్రత్యంగమునుండి
తన ఉనికిని వ్యక్తపరిచే వెలుగును ప్రసరించే
ప్రాణకళికను ఆరాధించడములో
మనిషికి ఆనందము, ముక్తీ ఉంది.
మనిషి ఈ సాధనలో ఎంత ఉత్తీర్ణుడైతే
వాడి జీవితము అంత సార్థకము,
రసప్రపూర్ణము అవుతుంది.

*

మనుషుల మధ్య జంతువులు తిరుగుతుంటాయి
దేవతలు తిరుగుతుంటారు.
కాని వచ్చిన చిక్కేమిటంటే
జంతువులను త్వరగా గుర్తిస్తారు మనుషులు.
ఎందుకంటే వాటిది కాటువేసే స్వభావం.
కాని వ్రేటు తిని, ప్రసన్న ఫాలభాగంనుండి
రుధిరధార స్రవించేవరకు
దేవతల గుర్తించడానికి అవకాశముండదు.

*

సముద్రజలము తనలోపలి క్షారానికి తానే బాధపడుతున్నట్టు
ఆవిరిరూపంగా పైకిలేచి
తియ్యని వర్షధారగా నేలకు జారుతుంది.
గొప్పవారు తమ లోపాలకు తామే పశ్చాత్తాపాగ్నిలో క్రాగి
ఆత్మ ఔన్నత్యాన్ని పొంది
కారుణ్యామృతాన్ని, ప్రేమసుధను లోకంపై వర్షిస్తారు.

*

"ఇవాళ నీవు చాల అన్యాయం చేశావు"
పామునోటిలో ఆక్రందిస్తూ కప్ప అంది.
"ఏమిటి ?" ఆశ్చర్యంగా అంది పాము.
"ఆకలిబాధకు యిట్టా బయలుదేరానో, లేదో,— నీవు గుటుక్కుమన్నావు"
పాము వెంటనే అంది—
"చెపితే నమ్మవుకాని, —— నా కడుపులోనికి పోయిచూడు
నీకే తెలుస్తుంది - నేనూ ఏమైన తిన్నానేమో ?"

*

ఆ దిశనుంచి, ఈ దిశకు వెలిగే
సత్యకాంతికి కళ్ళు బైర్లు కమ్ముతాయి.
సత్యాన్ని అందుకే ఎవరూ భరించలేరు.
అందుకే నిద్రపోయేముందు దీపాన్ని ఆర్పినట్టు
మామూలు మనుషులు, సత్యాన్ని ఆర్పి,
మామూలు గాఢాంధకారం చేసుకొని కాని నిద్రపోరు.

*

సూర్యుని చుట్టు వలయనృత్యం చేసే గ్రహాలలోకెల్లా ముగ్ధ భూమి.
ఎప్పుడూ, వాతావరణం జిలుగు ముసుగుతో
సూర్యుడికి ముఖం చూపడానికి సిగ్గుపడుతుంటుంది.
కాని సూర్యుడు తక్కువవాడా ?
ప్రియాలోకనం కోసరం, తన సహస్రకరాలతో
మాటిమాటికీ ఆ ఆచ్ఛాదనాన్ని తొలగిస్తూ ఉంటాడు.
కాని భూమి మాత్రము ఊరుకునేదా ?
తొలగించడమే తడవు, మళ్లీ ముసుగు లాగుకుంటూ ఉంటుంది.
భూమి సూర్యుల ఈ సరససల్లాపాలతోనే
ప్రతినిత్యం పొద్దుగడుస్తూ ఉంటుంది.
అవే మనకు వెలుగునీడలు.

*

కోపం ఉదాత్తమైనది.
సందర్భానుకూలమైన కోపం మరీ ఉదాత్తమైనది.
ఎందుకంటే— కోపం మనిషియొక్క అస్తిత్వానికి చిహ్నం.
కాని సమయాసమయాలు, ఉచితానుచితాలు ఎరగని కోపాన్ని,
ఒక వ్యాధిగా గుర్తించడములో సందేహపడవలసిన పనిలేదు.
దానికి ఎంత త్వరగా చికిత్స ఆరంభిస్తే అంతశ్రేయం.

*

అసలు చావుకన్న, దాని నీడతో
మనిషి ఎక్కువభాగం దిగులుపడుతున్నాడు.

*

వెన్నుయిచ్చి పారేవానికి, మృత్యువు రహస్యప్రదేశం చూపింది.
"ఇక్కడికి యిదే పదివేలు" అనుకున్నాడు వాడు.
కాని-తర్వాత ఆచోటికి కూడా పోయింది మృత్యువు.
కాని ఆ వేషంతో కాదు—మరో వేషంతో.

పట్టణము మేధ అయితే—పల్లెటూరు హృదయం.
మేధలేని హృదయాన్ని ఎవరూ గణుతింంచరు.
అట్లాగే-హృదయంలేని మేధను ఎవరూ ప్రేమించరు.

ఆకలిని నిగ్రహించడం కష్టమే.
కాని-రుచిని నిగ్రహించడం అంతకన్నాకష్టం.
ఆకలిలేని ఆకలి రుచి.

*

కన్నీరు ఉరలేచోట కాలుష్యముండనిమాట నిజమే.
కాని—
మొసలికూడా కన్నీరు కారుస్తుందని జ్ఞాపకముంచుకోవాలె.

*

ఒరులపై రుద్దడానికి చేయబడే చట్టాలు
ఎప్పుడూ విఫలమౌతాయి.
తన్ను తాను శాసించుకోవడానికి నిర్మింపబడే చట్టాలు
సఫలత నొందుతాయి.

*

ఏకాంతంలో జ్ఞాపకం వచ్చేది ఒకే ఒకడు-పరమాత్ముడు.
వాని ఇంకోపేరు పరమాప్తుడు.

కన్నీటి ఋణం చాలభారమైంది.
ధనం, ధాన్యం, మర్యాద- ఈలాటి కుబేరసంపత్తితో ఆ ఋణాన్ని తీర్చలేము.
కన్నీటి నిధి నీదగ్గర లేకపోతే లేకపోవచ్చుకాని
ఒకే ఒక పవిత్ర అశ్రుకణం చాలు ఆ ఋణభారం తీర్చడానికి.

*

అనాదికాలంలో భూగర్భంలో ఎక్కడో
మట్టిరూపంగా పడిఉండేది బంగారం
దానిపై ప్రప్రథమంగా కార్మికుడి చేయిసోకింది.
ఫలశః భూగర్భమునుండి బయటికి వచ్చింది అది.
తర్వాత కొంతకాలానికి శాస్త్రజ్ఞుని దృష్టి ప్రసరించింది దానిమీద.
దానితో మేలిమిగుణము వచ్చింది దానికి.
ఆ తర్వాత రాజకీయవేత్త దృష్టి పడ్డది దానిమీద.
దానితో అది నాణెముగా చలామణి వస్తువుగా మారిపోయింది.

ఆ తర్వాత చాలాకాలానికి పురుషప్రపంచముతో
అంతగా సంబంధములేని స్త్రీ స్పర్శ సోకింది దానికి.
దానితో- స్త్రీ, బంగారం- రెండు ఊహించ శక్యంకాని
అంత యిదిగా లావణ్యంగా, ప్రమాదభరితంగా మారిపోయినాయి.
హేమకంకణాలు, బంగారు నూపురాలు, రత్నహారాలు, వజ్రాంగుళీయాలు-
ఈలాటి అందమైన వస్తువులు, అవి ధరించిన సుందరాంగులు
చరిత్రలో రేపిన కల్లోలాలుచూస్తే
కార్మికుల పోరాటాలు, శాస్త్రజ్ఞుల ఆవిష్కరణలు,
ఆర్థికవేత్తల చలామణి సమస్యలు
ఇవన్నీ తుఫానులో గడ్డిపోచలుగా తోస్తాయి.

*

ప్రపంచములో అంటుజాడ్యాలు రెండు రకాలు.
ఒకటి శారీరకమైనది.—రెండు మానసికమైనది.
శారీరకమైన జాడ్యాలు ప్లేగు మశూచి, కలరా,
ఇలాటి వ్యాధులను మనిషి చాలవరకు అదుపులోకి తీసుకురాగలిగాడు.
ఇక మానసికమైన దురాశ, యుద్ధోన్మాదము
ఈలాటి జాడ్యాలకు ఇంతవరకూ, ఔషధము పోసీయండి;
ఈ భయంకర జాడ్యాలను జాడ్యాలుగానే గుర్తించలేదు మనిషి.

*

కోర్టువ్యవహారాల్లో చిక్కినవానికి,
సుడిగుండంలో పడ్డవానికీ అట్టే తేడాలేదు.
సుడిగుండంలో పడ్డవానిని ఎవడైనా ఒడ్డుకు చేరిస్తే చేర్చవచ్చు
కాని, కోర్టులో చిక్కిన వానికి అలాటి అవకాశం కూడాలేదు.
పైగా వానిని మరింత అట్టడుగుకు నెట్టే ప్రమాదముంది.

*

కోర్టుకు పోవడమంత మతిహీనత,
తెలివితక్కువతనం మరొకటి లేదు.
కోర్టులు- వ్యక్తులు తమ వ్యవహారాల తాము పరిష్కరించు కోవడానికి
కావలసిన విజ్ఞత, వివేకము, ఆత్మవిమర్శ, స్వేచ్ఛ
ఈలాంటి వాతావరణాన్ని కల్పించవు.
పోనీ ; తాము అయినా పరిష్కారం చేయవు.

సాలెగూడులో చిక్కిన కీటకాన్ని రక్తం త్రావినట్టు
పార్టీల సర్వనాశనం చేస్తాయి.

*

అసలు తగాదాలే తెలివితక్కువ.
కోర్టులకు పోవడం మరింత తెలివితక్కువ.
ఎప్పుడైతే మనలోపాన్ని మనం దిద్దుకోవడానికి అశక్తులమై పోతామో
ఆ లోపము మరెవరితోనూ దిద్దబడదు.
మనలోపాన్ని మనము తెలుసుకోక,
ఎదుటి పక్షంపై దోషారోపణ చేస్తున్నన్ని నాళ్లు,
ఈ Tragedy of errors యిట్లానే సాగుతూ ఉంటుంది.

*

భగవంతుని పూజించడం చాలాతేలిక
మనిషిని పూజించడం చాల కష్టం
ఆకలిగొన్న మనిషికి పిడికెడు మెతుకులు వేయని పిసినిగొట్టు కూడా
రామనామస్మరణ చేయడం దీనికి నిదర్శనం

*

కోర్టులో గెలిచామని చెప్పుకుంటారు కాని
న్యాయం లభించిందని ఎవరు చెప్పరు.
ఎందుకంటే,
ఎవరికైనా కావలసింది, గెలుపు - న్యాయం కాదు.

*

ఒకొకసారి పశుబలాన్ని పశు బలంతో ఎదిరించక తప్పదు.
కాని కేవలం పశుబలంతో విజయం సాధించడం దుస్సాధ్యం.
పశుబలం అడుగున నైతిక బలం ఉండటం అత్యావసరం,
నైతిక బలం అన్నిబలాలకు పునాది.

*

నా విరోధి గృహకవాటం
నాకు ఎప్పుడు మూయబడి ఉంటుంది.
కాని ఓ రహస్యమార్గం ద్వారా,

నా విరోధి క్షేమవర్తమానాలు
ప్రతినిత్యం తెలుసుకుంటూ ఉంటాను నేను.
ఆ రహస్య మార్గం విరోధికి తెలిసినా మూయడం కష్టం.
అది హృదయ ద్వారం.

*

ఇతరుల లోపాలు వెదకడంలో,
తన శక్తిని, కాలాన్ని వ్యయం చేసేవాడు
ఎంత కుశాగ్ర బుద్ధైనా, ఎంత బలవంతుడైనా,
ఏదో ఒకరోజు పతనం కాక తప్పదు.
స్వలోపాలు తొలగించుకోవడంలో
శక్తివంచన లేకుండా పాటుపడేవాడు
ఎంత మందమతి అయినా, ఎంత బలహీనుడైనా,
ఏదో ఒకరోజు గౌరవ పీఠం అధిరోహించక తప్పదు.

*

దురాశ అనే పన్నగానికి
అసూయ, మత్సరము అనేవి రెండు విషపుకోరలు.
అది తనను ప్రతిఘటించే ప్రతివానిని
తన విషపుకోరలతో కాటువేయ చూస్తుంది.
కాని అది ఎంత గుడ్డిది అంటే ఎదటివానిని కాటువేయబోయి
తనను తా కాటు వేసుకుంటుంది.
ఎదటివానిలో విషము చొప్పించాలనే ఆతురతలో
తనలో తాను చొప్పించుకుంటుంది.
ఎవరితో పోట్లాడాలనే భ్రాంతిలో తనలో తాను పోట్లాడుతుంది.
తుదకు ఎదటివాణ్ణి చంపాలనే ఆవేశంలో
తనగొంతు తాను పిసుక్కుంటుంది.

*

వెలుగు చాల స్వాభిమానం గలది.
తన పాదపల్లవాల తూచినట్టుగా వేస్తూ
మన హృదయాంగణంలో కాలు పెడుతుంది.
చీకటి అట్లా కాదు. సిగ్గుమాలినది,

కళ్లతో పదిసార్లు గెంటినా
అట్లాగే కొయ్యవోలె తిష్ఠవేసికొని కూర్చుంటుంది.

*

ప్రజాస్వామ్యం సిద్ధాంతరీత్యా చాలాగొప్పది.
కాని ఆచరణలో అడుగడుగునా జాగరూకత అవసరం.
ఎందుకంటే-ప్రజాస్వామ్యం మొట్టమొదటగా చేసేపని
ప్రతి సాధారణవ్యక్తిలో అహంను, ఆశను, పురిగొల్పడం.
అహం, ఆశ రెండూ గొప్పవే-మనిషిని కదిలించడానికి.
కాని వానితోపాటు ఆత్మనిగ్రహం, ఆత్మవిమర్శ అలవరచుకోవాలె.
ఆత్మనిగ్రహం, ఆత్మవిమర్శ కొరవడిన ప్రజాస్వామ్యం
కేవలం అరాచకంవైపు దారితీస్తుంది.
ఇక అరాచకంయొక్క పరిణామం సర్వనాశనం.

*

అనుభవాల అదృశ్య కరాంగుళులు హృదయతంత్రులను సోకగానే
ఓ దివ్యానుభవము ఉద్భవిస్తుంది.
అదే కవిత్వము.
పండితపామరభేదం లేకుండా
అందరి హృదయాల్లో ఈ తంత్రీవాద్యము అమర్చబడి ఉంది.
కాని అజ్ఞానంవలన కొందరిలో అవి (తంత్రులు) త్రుప్పుపట్టి పోతాయి.
అలసతవలన కొందరిలో అవి సళ్ళుపడిపోతాయి.
అజాగ్రత్తలో కొందరు వాటిని ముక్కలు చేసుకుంటారు.
కొందరు మాత్రమే తమ హృదయతంత్రులను శృతిజేసి
అనుభవాల అదృశ్యకరపల్లవాల ముందు ఉంచకలుగుతారు,
వారినే మనము కవులుగా సంబోధిస్తూ ఉంటాము.

*

కవుల్లో నానారకాలు.
కొందరు కొన్నికొన్ని సమయాల్లో కవులు
కొందరు కొంత కొంత భాగం కవులు
కొందరు గతించిన కవులు.
కొందరు కవులమని భ్రాంతిలో తిరిగే కవులు
కొందరు కవులమని తెలియని కవులు

కొందరు అపాదమస్తకం కవులు
కొందరు ఆమరణాంతం కవులు
కొందరు శతాధిక స్వీయగ్రంథభారంతో అణిగిపోయిన కవులు
కొందరు పూవుల వెదజల్లినట్లు స్వీయరచనాఖండాల
అక్కడ యిక్కడ పారవేసుకు తిరిగే కవులు
కొందరు తమ రచనలు ఏవో తమకు తెలియని కవులు
కొందరు తమ రచనలు తప్ప యితరమెరుగని కవులు
కొందరు అచ్చులో ఉండి చచ్చిన కవులు
కొందరు అచ్చు ఎరగకపోయినా మెచ్చబడే కవులు
కొందరు నవ్వే కవులు
కొందరు మాట్లాడే కవులు
కవుల్లో నానా రకాలు
వీరందరిలో—
తన సృష్టికి అతీతంగా ఉండేవాడే సరియైన కవి
ఆశకు అతీతంగా ఉండగలవాడే సృష్టికర్త కాగలుగుతాడు.

*

స్త్రీలో కాముకత ఉందని భ్రాంతి పడతాము.
కాని స్త్రీలో కాముకత లేదు.
ఒకవేళ మనదృష్టితో స్త్రీలో కాముకత మేల్కొంటే మేల్కొనవచ్చు.
అది వేరు విషయం.
నిరుపేద ఎంతో దుస్థితిలో ఉన్నట్టు.
వాడి స్థితికి వాడు బాధపడుతున్నట్టు భ్రాంతిపడతాము.
నిరుపేదకు తనను గూర్చిన జాలిలేదు.
మన సానుభూతి వానిలో self pity మేల్కొల్పితే మేల్కొల్ప వచ్చు.
అది వేరు విషయం.
సంపన్నుడు స్వర్గసుఖాలు అనుభవిస్తున్నట్టు మనం భ్రాంతి పడతాము.
అందరికుండే మామూలు చింతలు తప్ప
మనము భావించే స్వర్గ సుఖాలు ఏమీలేవు.
తాటిచాప గుడిసెలో బుట్టలల్లు కుంటూ ఉండే బిచ్చగాడిని
ఏ బాదరబంది లేకుండా నిశ్చింతగా ఉన్నాడని భ్రాంతిపడతాము.
కాని – కారము ముద్దకోసరం, గంజి మెతుకుల కోసరం
వాళ్ళు పడే తగాదాలు చూస్తే
ఇది భ్రాంతి అని ఊరకనే తేలిపోతుంది.

ఎదటివాళ్ళ మనో దర్పణంలో
మనముఖమే మనకు కనపడుతుంది.
అంటే - మన భ్రాంతియే మనమీదికి Reflect అవుతుంది.
అయితే - స్త్రీకి కాముకత, నిరుపేదకు కష్టాలు, సంపన్నుడికి స్వర్గసుఖం,
ఇలాంటివి ఉండవని కాదు.
సర్వసాధారణంగా వాళ్ళు ఇట్లా ఉంటారు అని,
మనము పడే భ్రాంతులగురించి యిక్కడ ప్రస్తావన

*

కళ్ల పొరలు క్రమ్ముతాయి, పళ్ల రాలి పోతాయి.
నడుం వాలి పోతుంది - శరీరం ముడుతలు పడుతుంది.
జవ సత్తువలు ఉడిగి పోతాయి.
ఏ కాస్తా యౌవనము సడలంది ఒకటి ఉంది మనలో
అది వ్యామోహం.
కాయం నులకకుక్కిలో కూలినా, —
ప్రొద్దోక సింగారంతో అలరిస్తూ ఉంటుంది మనల

*

ధూర్తులు కొందరు
నిదురించిన ఒక ముల్లా తల, గడ్డం, నున్న చేసివేశారు.
పాపము! అతను లేచి మామూలు ప్రకారం
ముఖ ప్రక్షాళన చేయబోయి
నీటిలో తన ప్రతిబింబం చూచుకున్నాడు.
ఏముంది? మామూలు గడ్డంతో ఉన్న ముల్లా కాక
గడ్డం, తల నున్న చేయబడ్డ ఎవరో కొత్తముల్లా కనిపించాడు.
ఆ ప్రతిబింబం చూచి ఆందోళనతో పరుగెత్తదొడిగాడు అతను.
"ఏమిటి? ఎక్కడికి?" అన్నారు కొందరు.
"ముల్లా ఎక్కడో తప్పిపోయాడు - అతణ్ణి వెతుక్కురావాలె."
నిజరూప సాక్షాత్కారం కోసరము
మనం కూడా ముల్లామోస్తరు అటు యిటు పరుగెత్తుతున్నాము.
కాని వచ్చిన లాభమేమిటంటే
ముల్లామోస్తరు మనని ఎవరూ పిచ్చివారు అనడం లేదు.
ఎందుకంటే - మనతోటి వాళ్ళుకూడా
అదేపనిలో తీవ్రంగా నిమగ్నులై ఉన్నారు.

గ్రంథాలు వల్లెవేయడం విద్యకాదు
వల్లించిన విషయాలు పరీక్షా పత్రాల కెక్కించి పట్టాలు పొందడం విద్యకాదు.
పరుల దుర్గతి కని గుండె కరగడం విద్య.
తనతోబాటు ఉచ్ఛ్వాస నిశ్వాసల విడిచే
ప్రాణుల హృదయ బాధల చదవలేని వారు
ఎంత పాండితీ మండనులైనా
పామరుల క్రింద జమచేయవచ్చు.

*

బంతి ఎంత ఎత్తు ఎగిరినా నేలకు తిరిగి జారినట్టు
మనము ఎన్ని విద్యలు నేర్చినా పొట్టదగ్గరికే చేరుకుంటూ ఉంటాము.
విద్యయొక్క అంతిమ లక్ష్యము పొట్టనింపుకోవడమే కనక అయితే,
పొట్టనింపుకోవడానికి ఇంతదూరం ప్రయాణం చేయవలసిన పనిలేదు.
ఏ అడవిలోనో వాసం చేసుకొని
కాయగసరులతో మనుగడ గడుపవచ్చు.
విద్యయొక్క పరమావధి— వినూతన జ్ఞానతృష్ణ.

*

అందరికీ చదువుకునే అవకాశాలు కలిగించడం తేలిక.
అందరికీ చదువుమీద ఆసక్తి కలిగించడం క్లిష్టకార్యం.
ఈ రెండోఘట్టములోనే విద్యావిధానం
పరాభూతమైపోతూ ఉంది.
అందుకే విద్యాలయాలు పెరుగుతున్నా
విద్యస్థాయి పెరగడంలేదు.

*

ఏదైనా యంత్రభాగము చెడిపోయినపుడు
మరమ్మతుకోసరం ఆ యంత్రాన్ని ఆపివేస్తాము.
పరీక్షాపత్రాలు దొంగిలింపబడుతున్నా
పరీక్షలు పోలీసుబలగంతో నడుస్తూన్నా
మనం విద్యాలయాలు అట్లాగే తెరచి ఉంచుతున్నాము.
దీనినే ఆత్మవిధ్వంసక మనస్తత్వమంటారు.

*

భోగభాగ్యాలవెనక మనము ఎంత పరుగెత్తినా
కష్టాలు తప్పవు-వ్యధలు తప్పవు.
రోగాలు తప్పవు చావులు తప్పవు.
మనిషిని భయా కులచిత్తుణ్ణిచేసే ప్రకృతిసహజమైన ఆపదలు తప్పనపుడు,
మనిషి భోగభాగ్యాలవెనుక
పరుగెత్తడములో ప్రయోజన మేమిటి ?
తిండి, గుడ్డ, తలదాచుకోవడానికి ఇల్లు
మనిషియొక్క ప్రాథమిక అవసరాలు.
మనిషియొక్క ప్రాథమికదశలో ఇవే ముఖ్యలక్ష్యాలుగా కనబడతాయి
వీటికోసమే కలలుకంటూ ఉంటాడు.
వీటికోసరమే పోరాడుతూ ఉంటాడు.
కాని మనిషి ఆకలి ఆకలి అని అరుస్తూ ఒకేస్థితిలో నిలిచిపోతాడు.
మనిషి కొంత ఎదిగిన తరువాత శరీరంయొక్క ఆకలికాక
మనసుయొక్క ఆకలి ప్రారంభమౌతుంది.
ఆ దశలో "సంగీతం, సాహిత్యం, చిత్రకళ, శిల్పం"
ఇలాటివాటిమీద ఆసక్తి ఉదయిస్తుంది మనిషికి.
వ్యక్తి జీవితంలో కాని, సమాజజీవితంలో కాని
ఇలాటి దశలు తప్పవు.
ఇక కేవలం ఆకలి ఆకలి యని కేకలువేయడం,
ఆకలిదగ్గరనే తిష్ఠవేసికొని ఉంటామనుకోవడం
మనిషియొక్క బాల్యావస్థకు చెందిన
మనస్తత్వంగా భావించవచ్చు.

*

బంగారుహోదా కట్టిన ఏనుగుమీద
పోతున్నట్టు తోస్తుంది అధికారవ్యామోహం.
కాని ఈ బంగారుహోదాకట్టిన ఏనుగ
తలతిరిగి పరుగుపెడుతుంది అప్పుడప్పుడు.
ఈ తలతిరగడమనేది దుఃఖంగా ఉంటుంది.
ఒకొకసారి ఈ గజారోహకులు నేలకూలడం,
ఒళ్ళు చితికిపోవడం ఇలాటి విషాదసంఘటనలతో
జీవితకథ అంతంకావడం తరుచుగా చూస్తూఉంటాం.

*

నిదురలో కూడా పసిపాప తల్లి వక్షభాగం విడువనట్టు
మనహృదయం నిద్రలోకూడా ఈశ్వర పాదార్పితం కావాలి.
లేకపోతే గడ్డిపాన్పుమీద పరుండబెట్టే శవనిద్రకు
మనిషినిద్రకు అట్టే తేడా ఉండబోదు.

*

జ్వరానికి సంబంధించిన తాపం స్వశరీరం నుండే ఉత్పన్నమైనట్టు,
స్త్రీ వాంఛలోని సుఖం మన శరీరంలోనుండే ఉత్పన్నమౌతుంది.
అటువంటప్పుడు ఆ సుఖమేదో బయటినుండి దిగుమతి అయితున్నట్టు
భ్రాంతిపడడం అనర్థదాయకం-ఆ సుఖమేదో నా లోపలిదే.
నా నరాలనుండి ఉత్పన్నమౌతున్నదే, అనే యధార్థ భావనతో స్త్రీని చూడు.
నీ కాముకత తొంబై తొమ్మిదిపాళ్లు పటాపంచలౌతుంది.
నీ తెలివితక్కువతనం మీద నీకు నవ్వు వస్తుంది.

*

పురుషుడు ఆకాశం-స్త్రీ ఇంద్రధనుస్సు.
పురుషుడు ఉరుము-స్త్రీ మెరుపు.
పురుషుడు ప్రవాహం-స్త్రీ గట్టు.
పురుషుడు మెలకువ-స్త్రీ స్వప్నం.
పురుషుడు అహం-స్త్రీ నమ్రత.
పురుషుడు వ్యాధి-స్త్రీ మూలిక.
పురుషుడు ఉన్నతం-స్త్రీ అగాధం.
పురుషుడు బలం-స్త్రీ మార్దవం.
పురుషుడు పురాణం-స్త్రీ చిత్రకథ.
పురుషుడు వచనం-స్త్రీ కావ్యం.
పురుషుడు బహిరంగ రహస్యం-స్త్రీ గుసగుస.
పురుషుడు నడక-స్త్రీ నృత్యం.
పురుషుడు కేక-స్త్రీ పాట.
పురుషుడు అట్టహాసం-స్త్రీ మౌనం.
పురుషుడు స్వేదం-స్త్రీ కన్నీరు.
పురుషుడు తాపం-స్త్రీ చందనం.
పురుషుడు నవ్వు-స్త్రీ మందహాసం.
పురుషుడు అంధకారం-స్త్రీ నెలవంక.

పురుషుడు క్రాంతి–స్త్రీ శాంతి.
పురుషుడు భూమి–స్త్రీ నక్షత్రం.
పురుషుడు తృష్ణ, స్త్రీ మృగతృష్ణ.
పురుషుడు దావానలం–స్త్రీ దివ్వె.
పురుషుడు శాస్త్రం–స్త్రీ కళ.

*

హృదయం యొక్క పనికూడా
పెదవులే నిర్వహించడం ఆరంభించిన దగ్గరనుండి
పెదవులకు ఎక్కడలేని ప్రాముఖ్యము ఏర్పడ్డది.
పెదవులెక్కడికి పోయినా ఎనలేని
స్వాగత సత్కారాలు, గౌరవ మర్యాదలు లభించ దొడిగాయి.
ఈ స్వాగత సత్కారాల్లోనైనా
ఇంత స్థానం దొరుకుతుందేమోనని
ఊరక పెనగులాడింది హృదయం.
కాని అక్కడగూడా పెదవులే సర్వాధిపత్యం వహించాయి.

*

పెదవులన్ని ఒకసారి సమావేశమై
హృదయాన్ని బహిష్కరించడానికి తీర్మానించాయి.
హృదయం ఏమీ మాట్లాడలేదు.
తుదకు తన చింతనైనా ప్రకటించలేదు.
హృదయం ఏమీ మాట్లాడకపోవడం
పెదవులకు కోపకారణమైంది.
పెదవులు హృదయంవంక తమ ప్రాబల్యం
ఇప్పటికైనా తెలిసిందా అన్నట్టు ఉరిమిచూశాయి.
హృదయం చాలాసేపు మౌనం వహించి
తుదకు ఒకే ఒక మాట అంది
"బహిష్కరించండి–కాదనను–పూర్తిగ బహిష్కరించండి
దీనిలో నా సహకారం తప్పక ఇస్తాను" అంది.
"ఒక దిక్కు నిన్ను బహిష్కరించడం
మళ్ళీ నీ సహకారం కోరడం–చాలా తమాషాగా ఉంది."
"ఈ పని మీరు మనఃపూర్వకంగా చేయదల్చుకున్నారు కాబట్టి"

పెదపులి మాట విని ఒకదానిమొహం ఒకటి చూసుకొని
నలుదిక్కుల లేచిపోయాయి.

*

వర్షాలు లేనపుడు బావులనుండి నీరు తోడి
పంటలు సజీవంగా ఉంచినట్టు
మనలో చైతన్యం నిద్రాణమై ఉన్నప్పుడు
గ్రంథాలు మన మనస్సులోని
అగ్ని చల్లారకుండా కాపాడుతుంటాయి.
వానలు కురియడంతో బావుల అవసరం తీరినట్టు
మనలోని చైతన్యజ్వాల,
అన్వేషణా దృష్టి, జిజ్ఞాస
జాగృతి అయిన మరునిమిషం మనకు
గ్రంథాల అవసరం తీరిపోతుంది.

*

ఒక విషయం మనం తెలిసికోవడం ఒకటి
లోకానికి స్పష్టం చేయడం ఒకటి
మనం విషయాన్ని ఎంత స్పష్టంగా తెలిసికుంటే
లోకానికి అంత సుబోధకంగా తెలియపరచవచ్చు.
కాని ఆ స్థితి ఏర్పడినంతవరకు
పెదవి విప్పడం విజ్ఞత అనిపించుకోదు.

*

భూమినుంచి త్రవ్వితీసిన బంగారాన్ని
కాపాడటానికి దాని గర్భమునుండే త్రవ్వితీసిన
ఇనుముతో కటకటాలు నిర్మించి.
దానిలో ఖైదీ అయ్యాడు మనిషి.

*

భూమి చూడటానికి ఎప్పుడూ
కాళ్ళకిందే ఉంటుంది
కాని యదార్థంలో అది తల పైకి ఎక్కి
మనపై పెత్తనం చెలాయిస్తూ ఉంటుంది.

*

భూమి గుండ్రంగా తిరిగే స్వభావం కలది కాబట్టి
భూమి మీద వ్యామోహం ఎవడికి కలిగినా
వాడి తల గుండ్రంగా తిరగడం ఆరంభిస్తుంది.
అందుకే బాహు విక్రమంగల రాజులు కూడా
ధరాకాంక్షులై ఒడ్డోరి బండి తిరిగిన
పిల్లలవలె నేల పడిపోయారు.

*

బలహీనతలు ఆదిలో మనకు
బలశక్తులుగా ద్యోతకమౌతాయి.
మనం పూర్తిగా వాటి వశమైన వెనుక
అవి తమ నిజరూపాన్ని బైట పెడతాయి.

*

బలం సత్యమైనది కాబట్టి
బలానికి పొగడ్త లవసరం లేదు.
బలహీనత మిథ్యాజనితం కాబట్టి
తన పొగడ్తలు తాను చెప్పుకుంటేనో
లేక తన్నొకరు పొగడితేనో
దాని ఉనికి దానికి ఏర్పడదు, తృప్తికలుగదు.

*

రోజుకొక ప్రవక్త జన్మిస్తుంటాడు భూమిమీద.
అట్లాకాక,
ఒకే ఒక అవతార పురుషుడు శాశ్వత కాలం
ధరిత్రిపై పూజలందుతూ కూర్చునే అవకాశం లేదు.
రోడ్డుపై నడిచేవారికి ఓ చెట్టు తరువాత మరో చెట్టు
చల్లదనం కూర్చినట్టు
పురోగామియైన మానవుడికి
ఒక మహాపురుషుని తరువాత మరో మహాపురుషుడు
ఉత్సాహశక్తులు సమకూరుస్తూంటారు.
ఎప్పటికప్పుడు కొంగ్రొత్తగా కనిపించడం
మహాపురుషుల లక్షణం.

ఐనా పరిగెత్తే బండిలో చెట్లు వెనక పడిపోయినట్లు
కాలవేగంలో మహాపురుషులు కూడా వెనక పడిపోక తప్పదు.

*

బైటివారి మెప్పు పొందాలనేది
మానసిక దుర్బలత.
ఈ యాచనా మార్గం గుండా మానసిక శక్తులు
బైటికి ప్రవహిస్తూ ఉంటాయి.
బైటికి ప్రవహించే శక్తులు ఎప్పుడూ వృధా పోతాయి.
ఈ డ్రైన్ ఎంత బలంగా ఉంటే
అంత దుర్బలుడుగా తయారవుతాడు మనిషి
మనిషిని నీరసింపచేసే ఏ ప్రవృత్తినైనా
త్వరలో నివారణోపాయం ఆలోచించుకోవడం అవసరం.

*

ప్రభుత్వమంటే-
లక్షాతొంభై వేల ఉద్యోగులే కాక
వారిమీద ఎన్నోమార్గాల ప్రభావం వేసే
జ్ఞాత అజ్ఞాత శక్తుల కూడా లెక్కలోకి తీసుకోవాలె.
కోట్లాది ప్రజల ఒక నిర్ణీతమార్గాన నడిపే కార్యభారం
ఈ లక్షాతొంభై వేల ఉద్యోగులూ
తలొకముక్క పంచుకుంటారు.
ఇలా ముక్కలు కావడంలోనే
సగం చచ్చిపోతుంది ప్రభుత్వం.
ప్రభుత్వభారమే కాక ఉద్యోగులకు
భార్యా పిల్లలు, రోగాలు, బాకీలు
ఇలాటి ఇంటిగొడవలెన్నో ఉంటాయి.
ఉద్యోగులశక్తి, కాలం, చాలా వరకు
ఈ స్వంతాలె హరించివేస్తాయి.
ఇక ఏదో నిర్ణీతవేళకు యాంత్రికంగా వచ్చి
ఫైళ్ళముందు చతికిలపడతారు.
కాని ప్రభుత్వమంటే ఫైళ్ళుకావు.
మనిషికి మనిషి సంబంధం ;
కాని ఫైళ్ళపైని మెమోరాండాలు, ఇండార్స్మెంట్లు

ఇలాంటి తతంగంలో మనిషికి మనిషి
సంబంధాలు క్షీణించి పోతుంటాయి.
ఇక ప్రభుత్వము కేవలం ఫైళ్ళవరకు
పరిమితమై ఉండిపోతుంది.
ఫైళ్ళలో నిర్జీవంగా ఉండే ప్రభుత్వాలకు
నూరేళ్ళ ఆయుష్షు లేకపోయినా
దినగండాలుమాత్రం కొల్లలుగా ఉంటాయి.

*

మధుమక్షికాలు కొమ్మకొమ్మకు తిరిగేది
కంటకాలు వెతకటానికి కాదు.
మకరంద సేకరణకు.
మనిషికూడా ఒరుల లోపాలు వెదకడానికి పుట్టలేదు.
గుణసంచయంకోసరం.
లోపాలు వెదకడానికి ఎక్కడికో పోనక్కరలేదు.
ఒక నిమిషము స్తిమితంగా కూర్చొని
నిన్ను నీవు పరిశీలించుకుంటే చాలు
నీ లోపాలు ఒకటొకటే అర్ధనగ్నంగా బైటికొస్తాయి.
నీ లోపాలు నీ కున్నట్టే-ఎవరిలోపాలు వారికున్నాయి.
నీవు నీ లోపాల విస్మరించినట్టే
ఎవరిలోపాల వారు విస్మరించి తిరుగుతారు.
ఎవరికివారు పరిపూర్ణులం అన్న ధీమాలో ఉంటారు.
నీ లోపాలు నీవు తేలిక చేసుకుంటే
నిన్ను నీవు తేలికచేసుకొన్న వాడవైతావు.
బైటివారి లోపాలు పెద్దచేస్తే
వారిని నెత్తికి ఎక్కించుకున్నట్టు అవుతుంది.
ఒకరిలోపాలు ఒకరు ఎన్నడము అంటే
ఒక కుష్టురోగిని ఒక కుష్టురోగి వెక్కిరించడంలాంటిది.

*

మృత్యువుకు కన్నీరు కార్చవలసిందే, కాని
తల బాదుకొని పెద్దశోకాలు పెడతాం.
కన్నీరు కార్చడానికీ, తన బాదుకోవడానికీ
పెద్ద అంతరం ఉంది.

కన్నీటిలో-
విధి అనుల్లంఘనీయం అనే భావం ఉంటుంది.
తలబాదుకొని శోకించడంలో
ఏదో అసహజస్థితి ప్రాప్తించినట్లు
అజ్ఞానమిశితమై ఉంటుంది.
తల్లిదండ్రుల అనుజ్ఞబడసి, ఆశీర్వాదములంది
నవ వధువుగా నడుస్తూ నా వెంట మందగతిగా
వియోగభారంతో నీవు రాల్చిన కన్నీటి ఋణాన్ని
నేనే విధంగా తీర్చుకోలేను.
కాని ఒకే ఒక మార్గం ఉంది.
మన ముద్దు బిడ్డను ఆశీర్వదించి
భర్తకు అంపకం పెట్టేప్పుడు
నీవు రాల్చే అశ్రుధారలో
నేనొక చుక్క రాల్చగలను.

*

చట్టాలు, న్యాయాన్ని సాక్షాత్కరింప జేసుకోవడానికి
శాసనకర్తలు చేసే తపస్సు
కాని అది సాక్షాత్కారం కావడంలేదు కాబట్టి
దినదినం చట్టాలు పెరుగుతున్నాయి!

*

ప్రభుత్వాలు ఎన్ని లోపాలు చేసినా క్షమించవచ్చుగాని
ప్రతి స్వల్పకార్యానికి ప్రతిసాధారణ విషయానికి
తమ దిక్కు చూచేంత నిర్వీర్యులను నిస్సహాయులనుగా
ప్రజలను చేయడమనేది క్షమించరాని నేరం.

*

హాస్పిటల్‌లో కాలుపెట్టినప్పుడల్లా
మంచాలపై నిస్సహాయంగా పడిఉన్న రోగులు,
వాళ్ళ వాడిన వదనాలు చూచి
నాగరికుడనని గర్వించే మనిషి అధోగతి
కొట్టవచ్చినట్లు కట్టెదుట నిలుస్తుంది.

*

పశువులు, పక్షులు భూమిమీద జీవకోటి
Hail and Healthy గా కనబడతాయి.
పశు పక్షుల ఆహార విహారాదులు
ఆరోగ్యంగా-బలంగా ఉండటానికి కారణాలు,
ఏమిటో కనుక్కొని మనిషి
వాటి జీవిత విధానంలోకి మారడం
ఉత్తమ నాగరిక లక్షణంగా కనబడుతుంది.
ఇక నాగరికత పేరుతో కాఫీలు-టీలు
కిళ్ళీలు-సోడాలు-పెట్రోలు వాసనలు
ఉరుకుల పరుగుల బ్రతుకులు
వాటితో సంక్రమించే అజీర్ణ వ్యాధులు,
'డయాబెట్సు', 'బి.పి.లు', 'క్యాన్సర్లు',
ఉన్మాదాలు, మూర్ఛలు,
వీటిని నిర్మూలించటానికి ఉపయోగింపబడే
నానావిధ రస, విష, గంధకాదులు,
ఇదే నేటి నవనాగరికుని కేస్ హిస్టరీ.
నాకరికులమని పిలుచుకుంటే పిలుచుకోవచ్చు.
కాని నాగరిక లక్షణం ఇదే అని చెప్పుకోవడం మాత్రం కష్టం.

*

మనకు తెలియకుండానే మనమొక
విషవాతావరణం కల్పించుకొని
దానిలో చిక్కుకొని పోయినాం.
మన నాగరికతలోని పై మెరుగులు, ఆకర్షణలు
ఉరుకులు పరుగులు, మనచుట్టు ఏర్పడ్డ
విషవాతావరణాన్ని మన కేర్పడకుండా చేస్తున్నాయి.
దాదాపు మనము పుట్టురోగులమై పోయినాము.
జన్మాంధునికి చూపు యొక్క ప్రాధాన్యత
ఎట్లా బోధపడుతుంది ?
ఇక పశుపక్షుల జీవన విధానంలోనికి మారడమనేది
వేరు ప్రశ్న కావచ్చుకాని, జటిల ప్రశ్న కాదు.
భూమి వాతావరణాన్ని బద్దలు చేసుకొని
గ్రహాంతర యాత్ర ప్రారంభించిన మనిషికి
తానున్నచోట నిర్మలంగా ఉంచుకోవడం

జటిల ప్రశ్నకిందికి రాదు.
మనిషి దృష్టి ఈ దిశగా మళ్ళి ఉండలేదు. అంతే-
మనిషి దృష్టి మళ్ళిన మరుక్షణం
ఈ కలుషిత వాతావరణం
కంటికి కనబడకుండా అంతర్హితమౌతుంది.
ఎలాటి రోగాన్నైనా నిమిషాల్లో కుదిర్చే
మందుల గూర్చి పరిశోధనలు జరుపుతున్నాడు మనిషి.
కాని రోగాలకు మూలకారణం ఏమిటీ అని
లోతుకు దిగి ఆలోచించడంలేదు.
మనిషి లోతుకుదిగి అలోచించనంతవరకు
మానవ జాతికి తనచేచేతులా తాను
తెచ్చి పెట్టుకునే విషమ సంకటాలు తప్పవు.
అందుకే జీవకారుణ్య దృష్టితో ఆరంభమైన వైద్యం
నేడొక భారీపరిశ్రమగా తయారైంది
తన పుండుమీద తాను బ్రతుకు గడుపుకొనే
దుస్థితికి దిగజారిపోయినాడు మనిషి.

*

చిర పరిచితమైన ఇంటిలోనికి
ప్రవేశించే బాలకునివలె
మౌనంగా ఉన్న హృదయంలోకి
ఆలోచనలు ప్రవేశించి, హృదయం యొక్క
నిశ్శబ్దతకు, గభీరతకు అచ్చరువు పడి
భయ విస్మయాలతో నిలువబడి పోతాయి.
ఒకొకసారి కొంతసేపు ఆగది. ఈగది తిరిగి
తనతో ఆడుకునే వారు, తనను పల్కరించే వారు
కనిపించక తన ఒంటరి తనాన్ని తానే భరించలేక
మళ్ళీ వచ్చిన చోటికి చేరుకుంటాయి.

*

గారడి వాని డోలు చప్పుడు విని దుస్తులు వేసుకొని
బైటికి పరిగెత్తుకొని వచ్చే కుర్రవాని మోస్తరు
ఎక్కడో - ఏదోరూపంగా ఉన్న మనం
జగన్నాటక సందర్శనాభి కాంక్షులమై

మాతృగర్భాంతరంలోకి చేరి
శరీరమనే దుస్తులు వేసుకొని
భూమి మీద అవతరిస్తాం
జగన్నాటక సందర్శనార్థ శక్తి
బాల్యావస్థలో ఉత్కటంగా ఉంటుంది.
రంగులు, రూపాలు, రుచులు, ధ్వనులు
మనల అట్టే ఆకర్షిస్తాయి.
బైట ఎక్కడ కాస్త అలికిడి అయినా
వీధిలోకి పరిగెత్తుక వస్తాము.
లోకము వినూత్నాకర్షణలు,
వింతలతో కూడిన స్వప్నపురిగా కనబడుతుంది.
మనం పెరిగి పెద్ద వాళ్ళమైనా కొద్ది
లౌకికాల్లో తగుల్కొని
భగవదత్తమైన ఈ దివ్యశక్తిని జార విడుచుకుంటాం.
ఎప్పుడో ఒకరోజు మన జ్ఞాన నేత్రం తెరువ బడుతుంది.
ఆ రోజు మన చేతుల్లో నోట్ల దొంతరలుంటే ఉండవచ్చు
కాని ఒంటి కాలిమీద ఏకాగ్రంగా తిరిగే బొంగరం గాని,
లోకాన్ని వింత వింత వర్ణాల్లో చూపెట్టే 'ప్రిజం'లు కాని ఉండవు.
సృష్టిని 'వండర్ ది అడ్మిరేషన్' తో చూచే దివ్యదృష్టి పోయినవెనుక
మనలో శేషించేది
కిలోగ్రాముల లెక్కలోనికి వచ్చే శరీరం మాత్రమే
సంకెళ్ళు ఈడ్చుకుంటూ తిరిగే 'హర్డెండ్ క్రిమినల్' మోస్తరు
దేహభారాన్ని ఈడ్చుకుంటూ శేష జీవితం గడపాలె.

*

ఘోషాలోని స్త్రీల బోలినవి భావాలు.
బైటికి రావడానికి సిగ్గు పడుతుంటాయి అవి.
లోకంలోని మొరటుతనం, అల్పత్వం ఉపేక్షాభావం
ఎక్కడ తారసపడతాయో అని జంకుతుంటాయి.
వాటిని బుజ్జగించి, బ్రతిమిలాడిబైటికి తీసుకవస్తాము.
లోకం నిర్లక్ష్యం, క్రూరవిమర్శ,
హేళనకు గురియై కొన్ని నశించిపోతాయి.
కొన్నిమాత్రమే ఇలాటి ప్రతిఘటనలకు తట్టుకొని

విశ్వవిజేతలుగా నిలువ బడతాయి.
అలాటి భావాలకే కేలోక్కిడుస్తూంటాం మనం.

*

శత్రువు కొరకు సింహద్వారం
తెరచి ఉంచనవసరం లేదు.
వెంట్రుకవాసి అవకాశం లభించినా
ఆ ఇరుకు మార్గం గుండానే కోట నాక్రమిస్తాడు.
బైటి శత్రువుకూ - లోశత్రువుకూ వర్తిస్తుంది ఇది.

*

భోగాలకు రోగాల రూపంగా మూల్యం చెల్లిస్తున్నాడు మనిషి.
రోగాలంటే ధనవ్యయం, దుఃఖం, మృత్యువు.
ఐతే ఇంత భారీ మూల్యాన్ని చెల్లించడానికి
భోగాల్లోని విశేషమేమిటి?
భోగాల్లోని సుఖం అత్యల్పం.
అయినా మనిషి ఆసక్తి అనేది అజేయం.
ఆసక్తిని జయించలేక మనిషి
భోగలాలసు డౌతున్నాడు
మనోనిగ్రహం లేకపోవడమే
ఈ అనర్థాలన్నిటికీ మూలకారణం.
మనోవేగాలు వే విధాలుగా విజృంభిస్తున్న
అణుయుగంలో మనోనిగ్రహం అనేది
ఉన్మత్తుని ప్రలాపం క్రింద జేరుతుంది.
వ్యక్తులెవరైనా మనో నిగ్రహం సాధించితే సాధించవచ్చు.
కాని సమాజానికి మాత్రం ఇది
గగనకుసుమంగానే ఉండిపోయింది.

*

కొద్ది దానికి ఆశ ఉంటుంది
కొద్దిది కాబట్టి
గొప్పదానికి ఆశతో నిమిత్తం లేదు.
పూర్ణమైనది కాబట్టి

కొద్దిది-గొప్పది మనలోనే ఉన్నాయి.
కొద్దిది అశాంతికి, గొప్పది శాంతికి మార్గాలు.

*

మానవుడు సహజ జీవనం గడపటానికి కావలసిన
సహజ అవసరాలు గాలి, నీరు, కాంతి, ఆహారం
ప్రకృతి సహస్రసహస్రాలతో ప్రసాదిస్తుంది.
డబ్బుయొక్క ప్రాధాన్యత ఎక్కడ వస్తుందంటే
కృత్రిమజీవనం గడపటానికి, కావలసిన
కృత్రిమ వస్తువులు సేకరించడానికి,
కృత్రిమమైన ధనము అవసరము పడుతుంది.

*

పుట్టడము, పుట్టడము ఎవరి రచన కాని
అచ్చులో పుట్టలేదు.
ప్రతివారు- ఎవరికివారు తేలికగా చూచుకొనే స్వీయరచనలే
సర్వసాధారణంగా చూచుకునే రచనలే,
అచ్చులోకి వచ్చి నలుగురి దృష్టిలో పడుతాయి.
అయినా అచ్చులో పడ్డ ప్రతి రచనా
గొప్పదిగా భావించ పనిలేదు.
అచ్చులోకి రానిది తేలికఅయింది కాదు.
ప్రచారబలం అప్పటికప్పుడు కొన్ని రచనలకు
ప్రాధాన్యత కల్పించవచ్చు
కాని రచనలమొక్క మంచి చెడ్డల నిర్ణయంచేది
కాలం మాత్రమే
కాలం యొక్కగీటు రాయికి నిలిచేవి
కొన్నమాత్రమే

*

ఈశ్వరుడు ఎప్పుడు హృదయాల దగ్గరకి రావాలని
నిజాంతరంగాల సాక్షాత్కరించాలని,
ప్రయత్నము చేస్తు ఉంటాడు
ఈశ్వరుని మరోపేరు నిశ్శబ్దం

కాని మన అహంకారము, ఆశ, ఆతురత నిశ్శబ్దం
దేవత, దరికిరాకుండా తరిమివేస్తు ఉంటాయి.
దినమంతా మనకు తెలియకుండానే ఈయర్థం
జరుగుతూ ఉంటుంది.
కాని రాత్రి వేళ మన సంరంభాలన్ని మరచి నిద్రాదేవి
ఒడిలో చేరుతాము.
జ్వరబాధలో దినమంతా కలవరించి
అప్పుడపుడె కన్నుమూసిన నిసుగుచెంతకు
మృదుపాదాల వచ్చె తల్లిమోస్తరు.
నిశ్శబ్దదేవత నిద్రలో మునిగిన
మన అంకభాగానికి వచ్చి
నలుగడల ప్రేమహస్తాల చుట్టివేస్తుంది.
మనలో బయట తానే అయిపోతుంది,
కంటక కీర్ణమార్గాల, దిశాముఖం తెలియని
ఘోర విపనాడవుల, చుకాకు, చింతలు, ఉద్రేగాలు
భయాలకే ముళ్ల పొదల చిక్కుక పోయిన, మనల
వెనకకు మళ్లించి, ఈశ్వరముఖంగా నిలవ బెడుతుంది.
రాత్రి అంతా నిర్నిమేష నయనాల మనంక
భాగాన నిలవబడి పరిచర్యలు సలిపి ఉదయము
కన్నుతెరిచె వరకు, కొత్త మనుషులగా తయారుచేస్తుంది.
మామూలు అయిపోయిక, భూమిఁ సూర్యుడు
ఆకాశం, మబ్బులు, నిత్యనూతనంగా కచిపించె
విధంగా, మనకు మనమెలాం గ్రొత్తగా తోచె విధంగా
మనస్సుశుభ్ర పరుస్తుంది.
పునర్జన్మ కొస్తుంది.

*

ఆశలపై ఆశలు పెంచుకునేవాడు, ఎప్పుడు తనకు తాను
భారముకావడమే కాక, లోకానికి భారంగా పరిణమించే ప్రమాదముంది.
తనను సంకెపం చేసుకొని నామమాత్రంగా
నిలవకలిగినవాడే యితరుల దుఃఖభారాన్ని
మోయగల దయాశీలుడు కాగలుగుతాడు.

*

చందనం అలదేనాడు, ముందు తన వ్రేళ్లు
గంధపాత్రలో ముంచితేకాని
మరొకరికి పూయడానికి అవకాశం చిక్కదు.
అట్లాగే అంతో యింతో ముందు చేతులు
మసిచేసుకుంటేనేగాని
ఒకడి ముఖానికి మసిబూసే అవకాశం లభించదు.

*

కీర్తి అనే ఉత్తుంగ శృంగం నిర్మిస్తూ పోవలసిందే
కాని అది కూర్చునే పీఠం కారాదు.
దానిపై కూర్చోవాలనే కోరిక
ఎప్పుడు ఉదయిస్తుందో
అప్పుడే దాని నిర్మాణం ఆగిపోతుంది.

*

వృత్తితో, స్థానంతో, పరిస్థితులతో
నిమిత్తం లేకుండా
ప్రతి మనిషికి,
ఒక ఉన్నతస్థానాన్ని యిచ్చాడు దేవుడు.
కాని మనిషి
తనకు యివ్వబడ్డ ఉన్నతపీఠంపై
ధనాన్నో, పదవినో
ఇంకే యితర వ్యామోహాన్నో కూర్చోబెట్టి
దాని కాళ్లదగ్గర ఊడిగం చేస్తుంటాడు.

*



# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదేళ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్వికసాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు, వీలైనంత ఎక్కువమందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకూ 32 ప్రచురణలను ప్రచురించి రెండు లక్షల ప్రతులకు పైగా సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించటానికి పూనుకొన్నది.

భారతదేశంలో ఎక్కడున్నాసరే - యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకోగలిగేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో దాదాపు 7,500 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేశారు. ఈరోజు నుండి ఈ ప్రణాళిక కొత్తరూపు దాలుస్తున్నది. ఇందులో కూడా సహృదయులు చేరి తమ సహాయ సహకారాలు అందజేస్తారని ఆశిస్తాము. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా దాదాపు 450 మంది, భారతీ భూషణులుగా 50 మంది చేరారు.

ఉడుతాభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచింది ప్రజలు. వారి సౌహార్ద్రం, భాషాప్రియత్వం ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయనశీలతా సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని ఆకాంక్షిస్తూ —

ఇరివెంటి కృష్ణమూర్తి

1-12-1974

అధ్యక్షుడు